# వైదిక వివాహ వైశిష్ట్యము









శ్రీమతి డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి



వైదిక సంస్కృతి పునరుద్ధారకుడు
- మహర్షి దయానంద సరస్వతి

ప్రియ పాఠకులారా !

ఈ వైదిక 'వివాహ వైశిష్ట్యమును' చదివిన మీకు ఆర్యసామాజికులనుసరించు వివాహ పద్ధతిలోని వైశిష్ట్యమేమో తెలియును. మరుగునపడిన వైదిక సంస్కార ప్రణాళికను వెలుగులోనికి తీసుకువచ్చిన మహర్షి దయానందునకు మనమెంతో ఋణపడి యున్నాము. సాంప్రదాయ చీకటుల నుండి హేతుబద్ధము, విజ్ఞానభరితము నైన వేద ప్రకాశము వైపు గొని పోయినాడే గాని దయానందుడు మరియొక క్రొత్త సాంప్రదాయమును నెలకొల్పలేదు. విద్యావంతులు, వివేకవంతులు పక్షపాతమును విడిచి బాగుగా నాలోచించి ఏది సరియైన మార్గమో దాని ననుసరింపుడు.

ఇట్టి వైదిక వివాహము జరుపుకోదలచిన, మీ సమీపములోని ఆర్యసమాజమును గాని, ఆర్య సామాజికులను గాని సంప్రదించిన వారు మీకు సహకరింతురు. మీరు ఏ వర్ణ (కుల), వర్గ, సాంప్రదాయమునకు జెందిన వారైనా శ్రద్ధతో ఈ పద్ధతిని అనుసరింపదలచిన అట్టి ఏర్పాట్లు వారు చేయుదురు.

- ప్రకాశకులు

# వైదిక వివాహ వైశిష్ట్యము



శ్రీమతి డా॥ సంధ్యావందనం లక్ష్మీదేవి

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమము**

వ్యాసనగర్, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061

గాయత్రీ గ్రంథమాల - 15
చతుర్థ ముద్రణ ప్రతులు : 2000

ప్రమాధి చైత్ర పూర్ణిమ
(31 మార్చి 1999)

మూల్యము : **8-00**

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, వ్యాస్ నగర్, సికింద్రాబాద్ - 61

2) స్వస్తిక్ మెటల్ ప్రొడక్ట్స్, 3-3-738, కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.

3) వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001.

4) ఆర్. కృష్ణమూర్తి బుక్ సెల్లర్స్, ఆర్యసమాజ మందిరము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61.





## ప్రకాశకీయము

నిషేకాది శ్మశానాంతో మంత్రైః యస్య ఉదితో విధిః

(మనుస్మృతి 2-16)

" నిషేకము (గర్భాధానము) మొదలు శ్మశానాంతము (శవదహనము) వరకు గల పదహారు సంస్కారములు వేద మంత్రములతో గృహ్యసూత్రాది కల్ప గ్రంథములలో వివరించిన అగ్ని హోత్ర విధి పూర్వకముగా జరుపవలె" నని మనుధర్మశాస్త్ర ఆదేశము.

నేడు లోకములో వివాహపద్ధతులు కోకొల్లలు. విమతస్థులైన క్రైస్తవ మహమ్మదీయాదులు వారి వారి ప్రార్థనాలయములలో లేదా వారి వారి గృహములలో తమ తమ మతగురువుల సన్నిధిలో వారిదైన ఒక పద్ధతిలో వివాహములు జరుపుకొనుచుండగా ఏకదేశీయులై ఏక ధర్మమునకు చెందినవారైనను భారతీయార్యులు అనేక పద్ధతుల ననుసరించుట కడు విచిత్రము! సాంప్రదాయము పేరుతో, తమ వంశాచారమను పేరుతో, తమ యింటి ఆచారమను పేరుతో విభిన్నపద్ధతుల ననుసరించుచున్నారు. (ఆకాశములో, గాలిలో, నీటిలో, శ్మశానములో కూడా వివాహములు చేసుకొను ఆచారములును అక్కడక్కడ బయలుదేరుచున్నవి.)

ఒకే వేదధర్మమునకు చెందిన మనలోనే వేదోక్త వివాహములు బ్రాహ్మణుల వరకు మాత్రమే పరిమితమై పోయినవి. ద్విజులైన క్షత్రియుల, వైశ్యుల యిండ్లలో కొన్ని ప్రాంతములలో మాత్రమే వేదోక్తముగా జరుగుచున్నవి. మిగిలిన శూద్రుల - అన్ని కులములవారి యింట కేవలము పురాణోక్తముగానే అదియును విభిన్న రీతులలో జరుగుచున్నవి. నేటి కులవ్యవస్థ కూడా వేద సమ్మతమైనది కాదు. గుణ కర్మ స్వభావముల ననుసరించి వర్ణ విభాగము జరుగవలెనని వేదాదిశాస్త్రములు ఘోషించుచుండగా జన్మతో వచ్చు వర్ణమే బలవంతముగా రుద్దబడుచున్నది. కేవలము వివాహములే కాదు నామకరణాది శుభకార్యములన్నియు భిన్నభిన్నములుగానే యున్నవి. ఇట్టి పరిస్థితులలో మనమంతా ఒకే ధర్మానికి, ఒకే సంస్కృతికి చెందినవారమని ఎట్లు చెప్పుకొనగలము? ధార్మిక కార్యకలాపములలో ఏకరూపత (Uniformity) రానంతవరకు ఐకమత్యమెట్లుండును ?

## ప్రకాశకీయము

నిషేకాది శ్మశానాంతో మంత్రైః యస్య ఉదితో విధిః

(మనుస్మృతి 2-16)

" నిషేకము (గర్భాధానము) మొదలు శ్మశానాంతము (శవదహనము) వరకు గల పదహారు సంస్కారములు వేద మంత్రములతో గృహ్యసూత్రాది కల్ప గ్రంథములలో వివరించిన అగ్ని హోత్ర విధి పూర్వకముగా జరుపవలె" నని మనుధర్మశాస్త్ర ఆదేశము.

నేడు లోకములో వివాహపద్ధతులు కోకొల్లలు. విమతస్థులైన క్రైస్తవ మహమ్మదీయాదులు వారి వారి ప్రార్థనాలయములలో లేదా వారి వారి గృహములలో తమ తమ మతగురువుల సన్నిధిలో వారిదైన ఒక పద్ధతిలో వివాహములు జరుపుకొనుచుండగా ఏకదేశీయులై ఏక ధర్మమునకు చెందినవారైనను భారతీయార్యులు అనేక పద్ధతుల ననుసరించుట కడు విచిత్రము ! సాంప్రదాయము పేరుతో, తమ వంశాచారమను పేరుతో, తమ యింటి ఆచారమను పేరుతో విభిన్నపద్ధతుల ననుసరించుచున్నారు. (ఆకాశములో, గాలిలో , నీటిలో, శ్మశానములో కూడా వివాహములు చేసుకొను ఆచారములును అక్కడక్కడ బయలుదేరుచున్నవి.)

ఒకే వేదధర్మమునకు చెందిన మనలోనే వేదోక్త వివాహములు బ్రాహ్మణుల వరకు మాత్రమే పరిమితమై పోయినవి. ద్విజులైన క్షత్రియుల, వైశ్యుల యిండ్లలో కొన్ని ప్రాంతములలో మాత్రమే వేదోక్తముగా జరుగుచున్నవి. మిగిలిన శూద్రుల - అన్ని కులములవారి యింట కేవలము పురాణోక్తముగానే అదియును విభిన్న రీతులలో జరుగుచున్నవి. నేటి కులవ్యవస్థ కూడా వేద సమ్మతమైనది కాదు. గుణ కర్మ స్వభావముల ననుసరించి వర్ణ విభాగము జరుగవలెనని వేదాదిశాస్త్రములు ఘోషించుచుండగా జన్మతో వచ్చు వర్ణమే బలవంతముగా రుద్దబడుచున్నది. కేవలము వివాహములే కాదు నామకరణాది శుభకార్యములన్నియు భిన్నభిన్నములుగానే యున్నవి. ఇట్టి పరిస్థితులలో మనమంతా ఒకే ధర్మానికి, ఒకే సంస్కృతికి చెందినవారమని ఎట్లు చెప్పుకొనగలము? ధార్మిక కార్యకలాపములలో ఏకరూపత (Uniformity) రానంతవరకు ఐకమత్యమెట్లుండును ?

పై మనుమహర్షి ఆదేశము ననుసరించి బ్రాహ్మణుల యిండ్లలో కూడా కేవలము వేదోక్తముగానే వివాహములు జరగుటలేదు. అచ్చటను విఘ్నేశ్వర పూజాది పురాణోక్తక్రియలే ప్రాధాన్యము వహించుచున్నవి. అగ్ని హోత్రము, వివాహానంతరము - మాంగల్యసూత్రధారణ, తలంబ్రాలు ఆశీర్వాదములు అయిన తదుపరి బంధు మిత్రులందరు విందులు సేవించుచు కబుర్లు చెప్పుకొనుచుండగా మరొకప్రక్క సినిమాపాటల రికార్డులు గోల చేయుచుండగా మొక్కుబడిగా కొన్ని వేదమంత్రములతో ఆహుతులనిచ్చుచున్నారు. అతి ప్రధానమైన పాణిగ్రహణ, శిలారోహణ, లాజాహోమ, సప్తపది ఆది ప్రమాణ మంత్రములు కేవలము పలికించుట జరుగుచున్నది. కాని దాని అర్థము చెప్పించుట గాని, వివరించుటగాని లేదు. అసలు ఆ మంత్రార్థములు సామాన్య పురోహితులకు తెలియునా? అనియు సందేహమే! ప్రాచీన ఋషులు వీటి ప్రాధాన్యతను అతి స్పష్టముగా వివరించిరి. చూడుడు -

**శ్లో॥ నోదకేన నవాచా కన్యాయాః పతిరిష్యతే ।**
**పాణిగ్రహణ సంస్కారాత్ పతిత్వం సప్తమే పదే ॥**

కొన్ని వేదమంత్రములు చదివి జలప్రోక్షణములు చేసినంత మాత్రమున కన్యవివాహితయై పతిని చేరలేదు. పాణి గ్రహణ సంస్కారము నుండి సప్తపది వరకు గల ప్రమాణములు పలికిన తదుపరి మాత్రమే ఏడవ అడుగుతో పతిని పొందును.

అన్ని శుభకార్యములలో అగ్ని హోత్రమే అగ్రముగా మొదటిగా నుండవలెను. దాని బదులు నేడు గణపతి పూజ చేయుచున్నారు. బుద్ధితో ఆలోచించిన గణపతికి విశేషణములుగా చెప్పబడు వక్రతుండ, రక్తవర్ణ, లంబోదరాది నామములన్నియు అగ్ని హోత్రమునకు వర్తించును. అగ్నియే అన్నిటినీ జీర్ణము చేసుకోగల లంబోదరుడు. రక్తవర్ణముతో జ్వలించుచు వక్రశిఖలతో హవ్య పదార్థముల నందుకొనుచుండును. అట్టి అగ్ని హోత్రమును విడిచి పసుపు బొమ్మల పూజ చేయుట ఏ వేదమంత్రాదేశము?

వివాహములో జరుపబడు వివిధ హోమములు గృహస్థుల కర్తవ్యములను బోధించు చుండును. అగ్ని హోత్రవేదిక ముందు వధువు వరుని కుడివైపున కూర్చుండి కుడి భుజమువలె సహకరించుచుండును.

శేషించి ప్రధాన హోమము చేయునపుడు తన కుడి చేతిని వరుని కుడి భుజముపై నుంచి నీవు చేయు యజ్ఞయాగాది పుణ్యకార్యములలో నీకు కుడి భుజముగా నుందునని ప్రమాణము చేయును. తదుపరి వధూవరులు రాష్ట్రభృత్ హోమములో తన దేశము విద్యా వైజ్ఞానిక రంగములలో అగ్రగామిగా నుండవలె ననియు, బ్రాహ్మక్షాత్ర శక్తులు (బుద్ధిబలము, భుజబలము) ఉన్నతి చెందవలెననియు ప్రార్థన లచేయుదురు. జయాహోమములో మా కన్ని రంగములలో జయము కలుగవలెననియు అందుకొరకు మేము ముందుగా ఇంద్రియ మనో జయములను సాధించగలమనియు ప్రమాణము చేయుదురు. అభ్యాతన హోమములో మా యిద్దరి శరీరములు దోషరహితమై, బలవీర్యములు గలవియై అట్టి సంతానమును కనగల శక్తివంతములు కావలెనని ప్రార్థింతురు.

నేడు బండికాడియొక్క కుడి రంధ్రమునుంచి నీరు పోసి వధువును శుద్ధి చేయు ప్రక్రియ వేదసమ్మతము కాదు. దీనిని గురించి ఒక పౌరాణిక కథ గలదు. కుష్ఠరోగము గల అపాలా అను ఒక స్త్రీ పెండ్లికాక విచారముతో చాలాకాలము ఇంద్రుని పూజించినదట. ఒకనాడు స్నానమునకు పోయి నదిలో కొట్టుకొని వచ్చుచున్న సోమలతను కొరికి నమిలి ఆ రసమును ఇంద్రుని కర్పించెనట. అందుకు ఇంద్రుడు ప్రసన్నుడై బండి కాడి రంధ్రములందు నీటిని వెడలించి ఆ నీటితో మూడుసార్లు ఆమెను శుద్ధిచేసెనట. అంతటామె సూర్యవర్చస్సుతో సమానమైన అందాలరాశిగా తయారయ్యెనట. ఈ కథలోని అర్థమేమో? పరమార్థమేమో? వ్రాసిన వారికే తెలియవలెను. సోమలతను ఔషధముగా తత్త్వమునుబట్టి అనుపానముతో సేవించిన, అగ్నిలో ఆహుతుల నిచ్చిన లాభము కలుగును. కాని కాడి రంధ్రములో నుండి నీరు పోసినంత మాత్రమున లాభమెట్లు కలుగును?

అగ్ని హోత్రము వాతావరణమును, తద్వారా ప్రాణులను శుద్ధిచేయు ఒక వైజ్ఞానిక ప్రక్రియ. బుద్ధితో ఆలోచించి తగిన ఓషదులతో హోమము చేసిన అనారోగ్యములు దూరమగును. బలవీర్యములు వృద్ధిచెందును. తదుపరి ఆ వధూవరులిరువురు తమకు కష్టములు దూరము కావలెననియు, మృత్యువు దూరము కావలెననియు, రాజశాసనాది ఈతి బాధలు లేక సుఖ సంతోషములతో సామాజిక, కౌటుంబిక జీవితము ప్రాప్తించవలెననియు ప్రార్థన చేయుచు కొన్ని విశేష ఆహుతుల నిత్తురు.

వివిధ హోమముల తదుపరి ప్రశాంత, నిశ్శబ్ద గంభీర వాతావరణమున సభికులందరకు సుస్పష్టముగా వినబడునట్లు వధూవరులిరువురు కొన్ని ప్రమాణములు చేయవలసి యున్నది. అవియే పాణిగ్రహణ, శిలారోహణ, లాజాహోమ, సప్తపది ఆదిక్రియాబద్ధ ప్రమాణములు. ఆ ప్రమాణముల అర్థమేమో నూతన వధూవరులు అర్థము చేసుకొనగల రీతిలో వివరించవలసి యున్నది. అప్పుడే వారి దాంపత్య బంధము అత్యంత ఆహ్లాదకరముగా, స్వర్గతుల్యముగా నుండును. అందుకు సాక్షులైన ఆహ్వానితులు కూడ క్రమశిక్షణను పాటించి సహకరించవలెను. అప్పుడే అది వైదిక వివాహ మగును.

ఆర్య పురోహితగా ప్రసిద్ధిచెందిన ధర్మసోదరి శ్రీమతి సంధ్యావందనం లక్ష్మీదేవిగారు ఆ ప్రమాణములను, వాటి అర్థములను సవివరముగా జనసామాన్యమునకు అర్థమగురీతిలో ఈ లఘుగ్రంథమునందు వివరించిరి. పాఠకులు వాటిని చదివి వివేకవంతులై వారి గృహస్థజీవనమును ఆనందప్రదము చేసుకుందురు గాక! యని ఆశించుచున్నాము.

– కోడూరి సుబ్బారావు

## కృతజ్ఞతలు

'వైదిక వివాహ వైశిష్ట్యమనే' ఈ లఘు గ్రంథాన్ని ఎందరో సహృదయులు తమ గృహాలలో జరిగే వివాహాలకు విచ్చేసిన బంధుమిత్రులకు కానుకగా అందించుట ఎంతో ముదావహము. మన భారతీయ సంస్కృతిని పరిరక్షించుకోవటానికి ఈ సత్కర్మ ఎంతగానో తోడ్పడుతుంది. వెయ్యి ప్రతులకు పైగా పంచిన ఆర్యబంధువులు శ్రీయుతులు K.P. రావుగారు, తేలుకుంట మోహనరావు గారు , కొడిప్యాక శివరాజ్ గారు మరియు యామ లక్ష్మణరావుగార్లకు వారి పరివారములకు మాట్రస్టు పక్షాన హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు తెలియజేయజేయుచున్నాను.

మీ

ప్రమాధి చైత్ర పూర్ణిమ
(31-3-1999)

సంధ్యావందనం శ్రీనివాసరావు
కార్యదర్శి (గాయత్రీ ఆశ్రమ ట్రస్టు)

ఓ3మ్

## నా అనుభవం

భారతీయ సంస్కృతిలో గల నాలుగు ఆశ్రమాలలో గృహస్థాశ్రమం సర్వశ్రేష్ఠమైనది. వివాహ సంస్కారాన్ని ఆలంబనంగా చేసుకొని దాదాపు 15 సం॥రం॥లుగ నేను ఆంధ్రదేశంలోని పలు ప్రాంతాలలో వైదిక ధర్మ ప్రచారం చేయడం జరుగుతున్నది. వేదమంత్రార్థాలలో గల రహస్యాల ప్రభావం ప్రజాబాహుళ్యంపై విశేషంగా పడటమే కాకుండా శ్రోతలను ఎంతగానో ఆకర్షిస్తున్నది. వివాహ సంస్కారాన్ని చూచిన బంధుమిత్రులు దీనిలోని ప్రత్యేకతను గుర్తించి ప్రశంసించటంతో పాటు వారి గృహాలలో కూడా ఈ వైదిక పద్ధతిలో వివాహ సంస్కారం చేయించుటకై మమ్మాహ్వానించి ఆదరిస్తున్నారు. ఇందుకు కారణం పౌరాణిక వివాహాలలో లేని ఒక ప్రత్యేకత ఈ వైదిక పద్ధతిలో కనిపించడమే.

ఈ వైదిక వివాహాలు చేసే సమయంలో పౌరాణిక పురోహితులు పండితులు కూడా ఉండటం జరుగుతుంది. ఈ సంస్కారంలోని గొప్ప మహత్త్వ పూర్ణమైన అర్థాలను, చేసే విధానాన్ని చూచి సహృదయంతో వారు కూడా సంతోషించక తప్పటం లేదు. ఒక్కొక్క సందర్భంలో పౌరాణిక పురోహితులను "మీరు కూడా వైదిక పద్ధతిలో షోడశ సంస్కారాలు జరిపిస్తే వాటి ప్రభావం ప్రజలలో వ్యాపించుటతో పాటు, వైదిక ధర్మ ప్రచారం కూడా జరుగుతుంది కదా! యని నేను ప్రశ్నిస్తే దానికి సమాధానంగా - "ఈ విధంగా మేము క్రమ పద్ధతిలో చేయలేమని, ప్రజలు మామాటలు వినరని, మేము వారిని శాసించలేమని" స్పష్టంగా చెప్పడం జరుగుతున్నది.

ఇప్పటికి వందలాది వివాహాలలో వేలాది జనాన్ని ఆకర్షిస్తూ, వారిని సత్యపథంలో ఆలోచింపచేసే మహత్తర శక్తి ఈ వివాహ సంస్కారానికుంది. నూతన వధూవరులకు గృహస్థ ధర్మమును గూర్చి బోధించుటే గాక సమాజానికి,

వ్యక్తికి ఉన్న సంబంధాన్ని, సాంఘిక మర్యాదలను, పరివారంలోని పవిత్ర బంధాలను ఆధ్యాత్మిక విలువలను గూర్చి కూడా కర్తవ్య బోధ చేసే ఈ వైదిక వివాహ సంస్కారం ప్రజలను విశేషంగా ప్రభావితులను చేస్తుంది. ఒక విధంగా చెప్పాలంటే సామాన్యుల నుండి మేధావి వర్గాల వరకు, ఈ సంస్కారం యొక్క ప్రభావం పడిందంటే అతిశయోక్తి కాదు.

వ్యక్తిగతంగా చెప్పాలంటే నాకీ సంస్కారాలు సమాజంలో విశేషమైన గౌరవ, ఆదర సత్కారాలను కలిగించడమే గాక, ప్రజలతో, ప్రముఖ వ్యక్తులతో, విద్యావేత్తలతో సత్సంబంధాలను ఏర్పరచాయి.

నేడు స్త్రీలు అన్ని రంగాలలో ముందంజ వేస్తున్నారు. కాని పౌరోహిత్యంలో మాత్రం వెనుకబడి ఉన్నారు. కేవలం పురుషులే పౌరోహిత్యం వహించాలనే భ్రమ మన స్త్రీలలో ఉంది. ధైర్యంగా ముందుకు వచ్చి సహనంతో, చక్కని భాషాశైలితో, భావగాంభీర్యంతో, సమయస్ఫూర్తితో విధి విధానాలను విస్మరించక వైదిక పద్ధతిలో సంస్కారాదులను చేయించినట్లైతే స్త్రీలు పురోహితులుగా బాగా రాణించే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. స్త్రీల సహజమైన స్వరమాధుర్యం అందరినీ ఆకర్షించి పురుషుల కంటె స్త్రీలే సమర్థవంతంగా సంస్కారాలు నిర్వహించగలరనే నిజం రుజువౌతుంది. స్త్రీలు సమాజం పట్ల తమ కర్తవ్యాన్ని విస్మరించక కాలానుగుణమైన మార్పులతో ఉద్యమించి సమాజంలోని అన్యాయాలను అన్ని కోణాల నుండి పరిశీలించి పరిష్కరించి సంఘానికి న్యాయం చేయాలంటే వారి శక్తి యుక్తులనుపయోగించి ప్రజలను చైతన్యవంతులను చేయాలి. దిశారహితంగా పయనిస్తున్న యువతకు స్ఫూర్తినిచ్చే నిరంతర ప్రయత్నం చేస్తేనే మనం ఆశించే ఆదర్శవంతమైన నవ సమాజాన్ని మరల మనం దర్శించగలుగుతాం.

మీ

సంధ్యావందనం లక్ష్మీదేవి

# వైదిక వివాహ సంస్కార వైశిష్ట్యము

## షోడశ సంస్కారముల విశిష్టత

వైదిక సంస్కృతిలో మానవ జీవనమును సంస్కరించుటకై షోడశ సంస్కారముల విధాన మేర్పరుపబడినది.

'సంస్కారో హి గుణాంతరాధాన ముచ్యతే (చరక ఋషి) సంస్కారముల వలన ముందున్న దుర్గుణములను తొలగించి వాని స్థానములో సద్గుణములు కలగుజేయునని చరకఋషి తెలియజేసెను.

మానవ నిర్మాణమొనర్చుట కేర్పరుపబడిన ఒక బృహత్ ప్రణాళిక ఈ షోడశ సంస్కారములు. జన్మించిన ప్రతి మానవుడు తనతో పాటు రెండు రకముల సంస్కారములను వెంటనిడుకొని వచ్చును. అవి -1) అనేక జన్మలనుండి తనతో తీసుకొనివచ్చు సంస్కారములు. 2) తన తల్లిదండ్రుల వంశ పరంపర ననుసరించి (ఆనువంశికముగ) వారినుండి సంస్కార రూపములో పొందునవి. ఇవి మంచివైనా కావచ్చును. లేక చెడువైనా కావచ్చును. ఈ ప్రణాళికలో శైశవావస్థనుండి ఉత్తమ సంస్కారములను ప్రాప్తింప చేసు కొను అవకాశమును కలుగజేసి పూర్వజన్మలలో నుండి వచ్చినవి గాని, తల్లిదండ్రుల ద్వారా సంప్రాప్తించినవి గాని, ఈ జన్మలో నేర్పడునవి గాని యైన చెడు సంస్కారములను నిర్బీజములుగా చేయుటకు తోడ్పడును.

మానవుని సమూలముగ మార్పగలిగి ఆమూలాగ్రముగ పరివర్తన మొనర్చుటకై వైదిక సంస్కృతిలో చేయబడిన ప్రయత్నములలో ఒకటి రెండు గాక 16 సంస్కారములు కలవు. వీనిలో కొన్ని ఆత్మ జన్మ నొందుటకు అనగా భౌతిక శరీరమును ధరించి జన్మించుటకు ముందుగనే ప్రారంభమగును. అవి 1. గర్భాధానము 2. పుంసవనము 3. సీమంతోన్నయన సంస్కారములు. కొన్ని జన్మించిన తరువాత చేయబడును. అవి 4. జాతకర్మ 5. నామకరణము 6. నిష్క్రమణము 7. అన్నప్రాశనము 8. చూడాకర్మ 9. కర్ణవేధము 10. ఉపనయనము 11. వేదారంభము 12. సమావర్తనము 13. వివాహము 14. వానప్రస్థము

15. సంన్యాసము 16. అంత్యేష్టి సంస్కారములు.

## వైదిక వివాహ మహత్త్వము

షోడశ సంస్కారములలో వివాహము 13 డవది. ఒకేగుణ కర్మ స్వభావములు గల ఆరోగ్యవంతులైన యువతీ యువకులు ప్రేమ పూర్వకముగ సుసంతానము నుత్పన్నము చేయుటకై ఈ వివాహ సంస్కారము రూపొందించబడినది.

వైదిక వివాహ మొక ధార్మిక సంస్కారము. అందువలన ఈ సంస్కారము చేయునపుడు వివాహముయొక్క ధార్మిక పునాది దృఢమగుటకు అనేక విధి విధానములు చేయబడును. వేద మంత్రములు చదువుట, అగ్ని సాక్షిగా వివాహము చేయుట, సప్తపది మున్నగు ముఖ్యక్రియలు బంధుమిత్ర పరివారముల నాహ్వానించి వారి సమక్షములో జరుపబడును. వివాహములు దైవ నిర్ణయములను లోకోక్తి (Marriages are made in Heaven) గలదు. ఆర్యులు చేయు ధార్మిక వివాహ సంస్కార రూపురేఖలు ఈ చిన్న పుస్తకమున తెలియ జేయుచున్నాను. ఈ విధి విధానము పారస్కర గృహ్యసూత్రము 1.3.4. లో ఇవ్వబడినది. దాని ఆధారముగనే ఋషి దయానందుల వారీ సంస్కారమును రూపొందించిరి.

మన ప్రాచీన మహాపురుషులైన మర్యాదా పురుషోత్తముడు - శ్రీరామచంద్రుడు ; యోగిరాజు - శ్రీకృష్ణుడు యిత్యాది మహనీయులకు ఈ వైదిక విధి ననుసరించియే వివాహములు జరిగినవి.

ఈ షోడశ సంస్కారములన్నియు నాలుగు వేదములు, గృహ్య సూత్రములు, శ్రౌతసూత్రములు, ఆరణ్యకములు, బ్రాహ్మణములు, మనుస్మృతి యిత్యాది ఆర్షసాహిత్యము ఆధారముగ రూపొందించబడినవి.

వైదిక యుగమునాటి మానవుని జీవనము నాలుగు భాగములుగ విభజింపబడినది. వీనికే ఆశ్రమములని పేరు. వ్యక్తిగత జీవన వికాసము ఆధారముగ ఈ ఆశ్రమములు విభజింపబడినవి. 1. బ్రహ్మచర్యము 2. గృహస్థము 3. వానప్రస్థము 4. సంన్యాసము అని నాలుగు రకములు. మానవుని సాధారణ (కనీస) జీవితము 100 సంవత్సరములగ భావింపబడినది.

కావున ప్రతి ఆశ్రమము 25సం॥రం.లుగ నిర్ణయింపబడినది. 25 సంవత్సరముల వరకు బ్రహ్మచర్యము, 25 నుండి 50 సంవత్సరముల వరకు గృహస్థము, 50 నుండి 75 సంవత్సరముల వరకు వానప్రస్థము, 75 నుండి మరణపర్యంతము సంన్యాసాశ్రమము. 25 సంవత్సరముల వయస్సు వరకు పురుషులు, 16 సంవత్సరముల ప్రాయము వరకు స్త్రీలు బ్రహ్మచర్యము పాటించి వివాహము చేసుకొని గృహస్థాశ్రమమున ప్రవేశించిన అది కనిష్ఠ బ్రహ్మచర్యమనబడును.

44 సంవత్సరములు వయస్సు గల పురుషులు, 22 సంవత్సరముల వయస్సు గల స్త్రీలు గృహస్థాశ్రమమున ప్రవేశించినచో అది మధ్యమ బ్రహ్మచర్య మనబడును.

48 సంవత్సరముల వయస్సు వరకు పురుషులు 24 సంవత్సరముల వరకు స్త్రీలు బ్రహ్మచర్యమును పాటించి వివాహము చేసుకొని గృహస్థాశ్రమమున ప్రవేశించినచో అది ఉత్తమ బ్రహ్మచర్య మనబడును.

గృహస్థాశ్రమమనునది ఇహ, పరలోకములను చక్కబరచుట కొక గొప్ప సాధనము. మానవుడీ సాధనమును తన స్వార్థము, సోమరితనము, ఈర్ష్య, అసూయ, ద్వేషము, లోభము, మూర్ఖతల వలననే పాడు చేసుకొనుచున్నాడు. మానవ జీవనమను దీర్ఘయాత్రలో విసిగి, వేసారి, అలసిపోకుండుటకే గృహస్థాశ్రమ మనునది ఏర్పాటు చేయబడినది. అతి దీర్ఘ యాత్రయందు సన్నిహితులు తోడుగా నున్నచో ఆ యాత్ర సరళముగ నుండును. మను మహారాజు గృహస్థాశ్రమమును శ్రేష్ఠాశ్రమమని పేర్కొనిరి.

**శ్లో ॥ యథావాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవ : ।**
**తథా గృహస్థ మాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమా : ॥ (మనుస్మృతి 3.77)**

వాయువు ఆధారముతో సమస్తప్రాణులు మనగలుగుచున్నట్లే సమస్త ఆశ్రమములు అనగా బ్రహ్మచర్య, వానప్రస్థ సంన్యాసాశ్రమములు గృహస్థాశ్రమమును ఆశ్రయించి యున్నవి. అనగా గృహస్థాశ్రమమే అన్నింటికీ ఆధారము. మానవ కల్యాణమునకు గృహస్థాశ్రమమే అత్యంత శ్రేయస్కరమై యున్నది. పూర్వకాలమున, ఋషులు, మునులు గృహస్థాశ్రమము నందుండియే సమస్త జనులకు మార్గదర్శకత్వము వహించుచుండిరని ఇతిహాసములు తెలుపుచున్నవి.

శ్లో ॥ చతుర్ణామాశ్రమాణాంచ గార్హస్థ్యం శ్రేష్ఠ ముత్తమమ్ ।

(వాల్మీకి రామాయణము)

నాలుగు ఆశ్రమములలో గృహస్థాశ్రమమే సర్వశ్రేష్ఠమైనదని మహర్షి వాల్మీకి అభిప్రాయము. గృహస్థాశ్రమము అత్యంత పవిత్రమైనదిగ నుండి భార్యాభర్తలకు ఆనంద సౌఖ్యములను సమకూర్చు సాధనముగ నుండ వలయును. కుటుంబ ప్రేమ, సంఘీభావము, శాంతి సౌఖ్యములు నిండి యుండవలయునన్న, భార్యాభర్తలిరువురు సహనశీలమును గలిగియుండుట అత్యంత అవసరము. దంపతులు అన్యోన్యముగ సంయమముతో వ్యవహరించిన వారి ప్రేమానురాగములు దినదినాభివృద్ధి చెందుచుండును. దివ్యగుణములతో కూడిన దంపతులున్న గృహమే స్వర్గముగ మన ప్రాచీనులు నుడివిరి. గోభిలీయ గృహ్యసూత్రములలో గృహమనగా యిట్లు చెప్పబడినది.

శ్లో ॥ న గృహం గృహమిత్యాహు : గృహిణీ గృహముచ్యతే ।
తయా హి సహిత స్సర్వాన్, పురుషార్థాన్ సమశ్నుతే ॥

(గోభిలీయ గృహ్య. సూ. 1-2-15)

గృహము గృహముగా చెప్పబడదు. గృహిణియే గృహము. పురుషు డామెతో కూడియే పురుషార్థములను సాధించును.

శ్లో ॥ సహైతావానాస యథా స్త్రీపుమాంసౌ, సంపరిష్వక్తౌ
స ఇమమేవాత్మానం, ద్వేధా z పాతయత్ తతః పతిశ్చ
పత్నీ, చాభవతాం తస్మాదిద మర్ధవృగల మివ ।

(బృహదారణ్యక ఉపనిషత్తు 1. 4. 3)

అర్ధశరీరము పత్ని, మిగిలిన భాగము పతి. ఒక బీజమునకు రెండు దళములుండునట్లు గృహస్థ మనెడు శరీరమునకు భార్యాభర్తలు రెండు సమాన భాగములుగ చెప్పబడినది. ఇట్టి సమాన బాధ్యతను స్వీకరించి యువతీ యువకులు ప్రవర్తించిననాడే వారి గార్హపత్య జీవనలత పుష్పించి ఫలించును.

**మం ॥ ఓ3మ్ సమ్రాజ్ఞీ శ్వశురేభవ, సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాంభవ ।**
**ననాందరి సమ్రాజ్ఞీభవ, సమ్రాజ్ఞీ అధిదేవృషు ॥**

**(ఋగ్వేదము 10 -85-46)**

ఓ వధూ ! నీవు అత్తమామలకు, ఆడబిడ్డలకు, బావమరదులకు అందరికి గృహసామ్రాజ్ఞివి (రాణివి) కమ్మని వేదమాదేశించుచున్నది.

**మం ॥ ఓ3మ్ సమితగ్ం సంకల్పేథాగ్ంసంప్రియౌరోచిష్ణూ సుమనస్యమానౌ**
**ఇషమూర్జమభి సంవసానౌ ॥ (యజుర్వేదము 12-57)**

గృహస్థాశ్రమములో ప్రవేశించుచున్నట్టి నూతన వధూవరులకు ఈ వేద మంత్రము ద్వారా భగవంతుడొక అమూల్యమైన సందేశమును ఇచ్చుచున్నాడు. ఈ మంత్రములోని 'సంప్రియౌ', 'రోచిష్ణూ' 'సుమనస్యమానౌ' అను పదములతో నూతన వధూవరులు అగ్ని హోత్రము చుట్టూ ప్రదక్షిణ చేయుచు నూఱు సంవత్సరములు సుఖజీవనప్రాప్తికై పరమేశ్వరుని ప్రార్థింతురు. స్త్రీ పురుషు లెల్లప్పుడు విరోధమును వదలి ఒకరితో నొకరు మిత్రులవలె ప్రేమతో వ్యవహరించుచు శుభసంకల్పములతో కూడిన మనస్సులు కలిగియుండి సాంసారిక విషయభోగములలో అతిగా చరించక సుందర వస్త్రాభూషణాది అలంకారములతో మీ సత్యకోరికలను తీర్చుకొందురు గాక ! మీరిరువురు శారీరిక బలముతో నూరేండ్లు జీవింతురు గాక ! యని పై మంత్రాభిప్రాయము.

గృహస్థాశ్రమమును స్వర్గధామముగ చేయుటకు ఈ వేద మంత్రములో ఐదు సాధనములు సూచింపబడినవి. ఈ ఐదింటిని పాలించు గృహస్థులు, స్వయముగనే పరాక్రమవంతులై వారికి వారే స్వయముగ రక్షకులగుదురు. ఆ గృహములో శారీరిక, మానసిక, ఆధ్యాత్మికములైన త్రివిధ క్లేశములు సర్వదా నిషిద్ధములై అత్యంత దూరముగ నుండును. ఇందలి

**మొదటి సాధనము** : సంప్రియౌ = వధూవరులైన మీరిరువురు ఈ గృహస్థ మనెడు పూదోటను సుఖసంతోషములతో చిగురించుచు, వికసింపచేయుటకై ఒకరిపైనొకరు ప్రేమరూప జలప్రసేచనమును చేసుకొనుడని భావము.

**రెండవసాధనము** : రోచిష్ణూ = సుఖ దుఃఖములకు మూలములగు ఈ ప్రపంచములోని పదార్థములవైపుకు ఇంద్రియములను పరుగెత్తనీయక వాటికి దూరముగా వుంటూ జ్ఞానవంతులుకండని అర్థము. చతురాశ్రమములలో మిగిలిన మూడింటిని నిర్వహించునట్టి ఈ గృహస్థాశ్రమము నందలి దంపతుల సముఖమున అనేక సమస్యలున్నవి. సాధారణముగ భార్య గృహమునకు సంబంధించిన కార్యములలోను, భర్త బయట ధన సముపార్జనాది కార్యములలోను నిమగ్నమై యుందురు. వారిరువురు తమ కార్యనిర్వహణలో అనేక చిక్కు సమస్యలను అధిగమింపవలసి వచ్చును. కనుక వారు కర్తవ్య కర్మల నవశ్యముగ చేయవలయును. కాని వాటిలో ఆసక్తులు-లిప్తులు కారాదు.

**మూడవ సాధనము** : సుమనస్య మానౌ = భార్యాభర్తలు మంచి స్నేహితులై మెలగుడని అర్థము. వివాహ సంస్కారములో యజ్ఞ వేదికపై నిలచి వధూవరులిరువురు - 'ఓ విద్వాంసులారా మేము ప్రసన్నతతో గృహస్థాశ్రమమున గడుపుటకు ఒకరినొకరము వరించుకొనుచున్నాము. మా యిరువురి హృదయములు భిన్న భిన్న రెండు నదులలోని జలముల వలె శాంతముగ కలిసి విడదీయరానివై యుండును గాక' ! అని ప్రతిజ్ఞ చేయుదురు. రెండు వేర్వేరు నదులలోని జలములను ఒక కలశములో పోసిన మరల ఆ నీటిని ఏ భౌతిక శాస్త్రజ్ఞుడు వేరుచేయజాలడు. అట్లే రెండు పరివారముల నుండి వచ్చిన ఆ వధూవరులిరువురు కలసిమెలసి ప్రేమపూర్వకముగ మంచి మిత్రులవలె తమ గృహసమస్యలను పరిష్కరించుకొనినచో గృహమే స్వర్గమగును. స్నేహమున్నచోట ద్వేషమునకు తావుండదు. ద్వేషము లేనిచోట దుఃఖముండదు.

**నాలుగవ సాధనము** : సంవసానౌ = సుందర వస్త్రములు మున్నగు అలంకారములతో అలంకరింపబడి తమ ఆరోగ్యములను వృద్ధి చేసుకొందురుగాక! గృహిణి సుందరముగా గృహము నలంకరించి స్వయముగ తానలంకరించుకొని భర్త బయటినుండి గృహమునకు వచ్చు రాకకై ఎదురు చూచుచుండును. అట్టి సుఖపూరిత వాతావరణములో భర్త తాను బయట పొందిన అలసటను మరచి సుఖము ననుభవించును. పవిత్రము, స్వచ్ఛము,

సుందరమైనట్టి గృహ వాతావరణము ఆ గృహము నందు నివసించువారికే గాక ఆ గృహమున కేతెంచు బంధుమిత్రులకు కూడ ఆహ్లాదము కలిగించి ఆనందమున నోలలాడించును. అట్లే భర్త కూడా గృహిణిని, గృహమును ధ్యానమున నుంచుకొని భార్యను తగినట్లు గౌరవించుచు సుఖజీవనము గడుపవలయును.

**ఐదవసాధనము** : ఇషమ్ సమితమ్ = కోరికలను ఏకత్రితము చేసి అనుభవింపుడు. అనగా పతి కోరికల ఎడల పత్నికి, పత్ని కోరికల ఎడల పతికి ధ్యాన ముండవలయును. ఈ సామరస్యభావము లేక పోవుటచే నేడనేక గృహములు నరకతుల్యములుగ నున్నవి. కేవలము తన కోరికలు మాత్రము భార్య తీర్చవలయునని తలంచుచు భార్య కష్టసుఖములను లెక్కచేయని భర్తలు అధికమగుచున్నందుననే నేటి స్త్రీలలో తమకు స్వాతంత్ర్యము లేదను భావము విరివిగా కలుగుచున్నది. వైదిక మర్యాదలోపించిన కారణముగా స్త్రీలు నేడు చులకనగా చూడబడుచున్నారు. పురుషులు వారిని అనేక విధములుగా అణగద్రొక్కుచున్నారు. దీనివలన మహిళ సంస్కారము దెబ్బతిని ఆమె సాంఘికముగాను, విద్యా రంగములోను వెనుకబడియున్నది. ఇది శాస్త్రములకు విరుద్ధము. యూరపు దేశములలో వివాహిత స్త్రీలను ఉత్తమార్ధము (Better - Half) అందురు. కాని భారతదేశములో వారిని అర్ధాంగిని (Equal - Half) అందురు. ఋగ్వేదములోని 10వ మండలములో 159వ సూక్తములోని 2వ మంత్రములో "**అహంకేతురహం మూర్ధా అహముగ్రా వివాచనీ**" । నేను సమాజమునకు మార్గమును చూపు పతాకమును. నేను సమాజమునకు శిరస్సును. నేను ధారాళముగా వాదించు వకీలు ( న్యాయవాదిని) ను. అని స్త్రీ సగర్వముగా చెప్పుచున్నది. ఈ సూక్తములోనే మరొక చోట -

**'యథాహమస్య - వీరస్య విరాజని జనస్యచ'**

" నేను వీరులకు రాణిని. ఈ సైన్యమును నడిపించు నాయకురాలిని." వేదములో స్త్రీ విషయములో గల యిట్టి అత్యంత గౌరవప్రదమైన భావనలు అద్వితీయములు.

ఇహ, పరలోకములలో సుఖమును పొందుటకు వివాహమును చేసుకొని తన శక్తి ననుసరించి పరులకుపకారము చేయుచు నియమపూర్వకముగా విధియుక్తముగా ఈశ్వరోపాసన, సంధ్యాది యజ్ఞములు, గృహకార్యములను నిర్వహించుచు సత్యధర్మములందు తను మనోధనముల నర్పించుట, ధర్మానుసారముగ సంతానోత్పత్తి నొనర్చుట మున్నగునవి గ్రహస్థాశ్రమ కర్తవ్యములుగా మహర్షి దయానంద సరస్వతులవారు తెలిపిరి.

## వరస్వాగతము

వివాహము జరుగురోజున వరుడు తన ఇంటివద్ద మంగళస్నానము చేసి నూతన వస్త్రములను యజ్ఞోపవీతమును ధరించి బంధుమిత్రులతో కలసి ప్రాతఃకాలముననే దైనిక అగ్ని హోత్రముచేసి తదుపరి వివాహ ఆరంభ సమయమునకు ముందుగానే బంధుమిత్రులతో పాటు వధువు గృహమునకు రావలయును. వధువుకూడ వరుని రాకకు పూర్వమే మంగళ స్నానము చేసి నూతన వస్త్రములను యజ్ఞోపవీతమును ధరించి తన బంధు మిత్రులతో పాటు దైనిక అగ్ని హోత్రమును ముగించి వరునకు స్వాగతము పలుకుటకు సిద్ధముగ నుండవలయును. వరుడు వివాహ మండపమును సమీపింపగనే వధువు ఎదురేగి అతనిని మండపములోనికి తీసుకొని రావలయును. తదుపరి వధువు వరుని సత్కరించుట (వరపూజ) ప్రారంభమగును.

1. పూర్వాభిముఖుడై నిలుచున్న వరునకు వధువు ఎదురుగ నిలచి మెడలో పూలహారము నుంచవలయును.
2. తదుపరి ఆసనమును చూపి కూర్చుండ జేయవలయును.
3. తానును కూర్చొని కాళ్ళు కడుగుకొనుటకై కలశముతో జలము నివ్వవలయును (పాద్యం)
4. ముఖము చేతులు కడుగుకొనుటకై పాత్రతో జలము నివ్వవలయును. (అర్ఘ్యం).
5. అచమనమునకు (త్రాగుటకు) పాత్రతో నీరివ్వవలయును. (అచమనీయం)

6. మధుపర్కమును - పెరుగు, నెయ్యి, తేనెలు కలిపిన దాని నొక పాత్రలో నుంచి, దానిని వరున కందివ్వవలయును. వరుడు దానిలో కొంత నలుదిశల, క్రింది పైదిశలలో చల్లి మిగిలిన మధుపర్కమును తాను ముమ్మారు తినవలయును. (మధుపర్కం)
7. ఆచమనము, ఇంద్రియ స్పర్శలు చేయవలయును.
8. తదుపరి కన్య వరునకు గోవు నిచ్చి సత్కరించును.

దీనితో వరపూజ - (పూజనం నామ సత్కారః) వరుని సత్కరించుట పూర్తి యగును.

### కన్యా ప్రతిగ్రహణము

కన్య తల్లిదండ్రులు కన్య కుడిచేతిని వరుని కుడి అరచేతిలో నుంచి తామిరువురు తమ కుడి చేతులను పైన, ఎడమ చేతులను క్రింద ఉంచి -

శ్లో ॥ **కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే**
**శ్రీ మతే z స్మై ప్రయచ్ఛామి మోక్షకామార్థ ధర్మణే ॥**

నా అనుంగు పుత్రిక చి॥ల॥సౌ॥.......................... పాణిని గ్రహించి గృహస్థ జీవితమును గడుపుచు ధర్మ అర్థ కామ మోక్షములను సాధింతువు గాక! అందురు.

ఈ క్రియలో కన్య తల్లిదండ్రులు తమ కుమార్తెను గ్రహించి పురుషార్థములైన ధర్మ అర్థ కామ మోక్షములను సాధింపుమని వరుని కోరుదురు. వరుడు అట్లే ఆచరింతునని అంగీకరించి కన్యను స్వీకరించును. దీనికే కన్యా ప్రతిగ్రహణము లేక కన్యాదానమని పేరు. ఇచ్చట కొందరు విమర్శకులు చెప్పునట్లు కన్యా + దానమ్ = కన్యాదానమ్ అనగా 'కన్యను దానము చేయుట' అని కాక కన్యా + ఆదానమ్ = కన్యాదానమ్ (కన్యాయాః ఆదానమ్) అని చెప్పుట తగును. ఆదాన మనగా గ్రహించుట అని అర్థము. కన్యతండ్రి 'ప్రతిగృహ్ణాతు భవాన్' అనును. ప్రతి గ్రహణమునకు 'దానము తీసుకొనుట' అను అర్థము లేదు. దాన శబ్దములో యిచ్చి పుచ్చుకొనుటలుండవు. ప్రతి గ్రహణములో ఆదాన - ప్రదానములు (Responsiveness on both sides ) యిరువురు యిచ్చిపుచ్చుకొను భావము గలదు. ఋషి దయానందులవారు

సంస్కార విధిలోగాని తన యితర గ్రంథములలో గాని ఎక్కడను కన్యాదానమని ప్రయోగింపలేదు. కన్యా ప్రతిగ్రహణమనియే వ్రాసిరి.

స్థూలబుద్ధితో ఆలోచించిననూ కన్య, గోవు మున్నగు వానివలె దానముగ నివ్వబడు వస్తువు కాదు. అట్లయినచో వరుడు ఊరేగింపుతో కన్య యింటికి తరలిరావలసిన అవసరముండదు కదా!

తదుపరి కన్యకు వరుడు వస్త్రములనిచ్చి సత్కరించును. ఇరువురు నూతన వస్త్రములు ధరించి వివాహ వేదికపైకి వచ్చి పూర్వాభిముఖులై నిలబడుదురు. వధువు వరునకు కుడిభాగమున నిలబడును. ఇరువురు సభాసదులకు నమస్కరించి యిట్లు తెలుపుదురు.

**1.మం॥ ఓం సమంజంతు విశ్వేదేవాః సమాపో హృదయాని నౌ ।**
**సం మాతరిశ్వా సంధాతా, సముదేష్ట్రి దధాతు నౌ ॥**

**(ఋగ్వేదము 10-85-47)**

" ఓ విద్వాంసులార ! మేమిరువురము ప్రసన్నతతో (సంతోషముగ) గృహస్థాశ్రమమున కలసి జీవించుటకు ఒకరినొకరము వరించుకొంటిమి. రెండు నదులలోని జలములు కలిసి ఒకటియై విడదీయ సాధ్యముకానటుల ఈ గృహస్థాశ్రమమున మా ఉభయుల హృదయములు ఒక్కటియై ప్రశాంత జీవనమును గడుపుటకు తోడ్పడును గాక ! సర్వాంతర్యామి సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు ఈ విశ్వమంతటిని ధరించియున్నట్లు మేమొండొరులను ధరింతుము. మేము పరస్పర ప్రేమానురాగములతో విలసిల్లుదుము."

గంగా - యమునా ; గోదావరీ - కృష్ణా యిట్లు రెండు నదులలోని జలమును తెచ్చి ఒక కలశములో పోసిన మరల వాటిని వేరుచేయుట అసాధ్యమైనట్లే రెండు వేర్వేరు పరివారములలో నుండి వచ్చిన వధూవరులను వివాహసంస్కారముద్వారా గృహస్థాశ్రమములో ప్రవేశింపజేసినచో వారిరువురు ఒక్కటియై ఒక రథమునకు రెండు చక్రములు వలె నుండి గృహస్థాశ్రమమను రథమును గమ్యమునకు చేర్చుటకు తోడ్పడుదురు. అనగా యిరువురు కలసి పురుషార్థములను సాధింతురని భావము. తదుపరి వరుడు వధువుతో-

2. ఓం యదైషి మనసా దూరం దిశో z నుపవమానో వా,
హిరణ్యపర్ణోవైకర్ణః స త్వా మన్మనసాం కరోతు (అసౌ) (పార. గృహ్య. 1-4-15)

" ఓ దేవీ ! నీవు ప్రేమతో కోరి నన్ను చేరుచున్నావు. అట్టి నిన్ను పరమేశ్వరుడు నా కనుకూలముగ చేయునుగాక !"

3. **ఓం భూర్భువః స్వః అఘోర చక్షురపతిఘ్న్యేధి**
**శివా పశుభ్యః సుమనా సువర్చాః, వీరసూర్ దేవృ**
**కామా స్యోనా శన్నో భవ ద్విపదే శం చతుష్పదే.**

**(ఋగ్వేదము 10-85-44)**

" ఓ వధూ ! పతిని ద్వేషింపని నీవు సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరుని కృపవలన ప్రియమైన దృష్టి కలదానవుకమ్ము. మంగళకారిణివి మంచి మనస్సు తేజస్సు కలదానవు. శుభగుణములతో కూడిన దానవునై బంధుమిత్రులకు శుభమును శాంతినిమ్ము. అట్లే నేనును వర్తింతును" అనును.

ఇరువురు ఒకసారి హోమకుండము చుట్టూ ప్రదక్షిణ చేయుదురు. తదుపరి వధువు పరమేశ్వరు నిట్లు ప్రార్థించును.

4. **ఓం ప్రమే ప్రతియానః పంథాః కల్పతాగ్ం**
**శివా అరిష్టా పతిలోకం గమేయమ్ ॥** (మం. బ్రా. 1-1-8)

హే భగవన్ ! నాకు పతిని పొందుమార్గమును కల్పింపుము. నేను శుభగుణములతో విలసిల్లుచు పతిగృహమున సుఖమును శాంతిని పొందుదును గాక !

## మంగళ హోమములు

1. ఋత్విక్కులను ఎన్నుకొనిన పిదప అగ్ని హోత్రము నారంభింపవలయును. తదుపరి
2. ప్రధాన హోమము (వధువు తన కుడిచేతిని వరుని కుడి భుజము పై నుంచవలయును.
3. రాష్ట్ర భృద్ హోమము.
4. జయా హోమము
5. అభ్యాతన హోమము
6. మృత్యువు, దుఃఖ విమోచన హోమములను వధూవరులిరువురు

సంపన్న మొనర్చవలయును.

రాష్ట్రభృద్ హోమ మంత్రములు 12. వీనిలో అగ్ని సూర్యుడు, చంద్రుడు, వాయువు, యజ్ఞము, మనస్సులనునవి గంధర్వులు. అనగా ఇవి ఈ ప్రపంచమును వేర్వేరు రూపములలో ధరించుచుండును. సమాజములో బ్రాహ్మ - శక్తి మరియు క్షాత్ర - శక్తులను రక్షింపుమని పరమేశ్వరుని ఈ మంత్రముల ద్వారా అర్థించుట జరిగినది. బ్రాహ్మ శక్తి యనగా మానసిక, ఆధ్యాత్మిక జ్ఞానమునకు సంబంధించిన శక్తులు. క్షాత్రశక్తి యనగా (అధి భౌతిక బలము) భుజబలమునకు సంబంధించిన శక్తి. ఈ రెండు శక్తుల పైననే సమాజము - దేశముల ఉన్నతి ఆధారపడి యుండును. కనుక దీనికి రాష్ట్ర భృద్ హోమమని పేరు.

### పాణిగ్రహణము - ప్రతిజ్ఞ నొనర్చుట

వరుడు లేచి నిలబడి వధువు కుడి చేతిని అరచేయి పైకి ఉండునట్లు తన అరచేతితో పట్టుకొని ఇట్లు ప్రతిజ్ఞ చేయవలయును.

1. **ఓం గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా**
   **పత్యా జరదష్టిర్ యథాసః, భగో అర్యమా సవితా**
   **పురంధిర్ మహ్యం త్వాదుర్ గార్హపత్యాయ దేవాః ।** (ఋ. 10-85-36)

" ఓ దేవీ ! ఐశ్వర్యాదుల నాశించి నీ హస్తమును చేపట్టుచున్నాను. భర్తనగు నాతో వృద్ధాప్యము వరకు సుఖముగా జీవింపుము. పరమేశ్వరుడు, సభ్యులైన ఈ పెద్దలెల్లరు గృహధర్మములను నిర్వర్తించుటకై నిన్ను నాకొసంగిరి. ఈనాటి నుండి మన మిరువురము ఒకరికొకరు విధేయులమై యుందుము." గాక !

2. **ఓం భగస్తే హస్తమగ్రభీత్ సవితా హస్తమగ్రభీత్,**
   **పత్నీ త్వమసి ధర్మణాహం గృహపతిస్తవ ।** (అథర్వ 14-1-51)

" ఓ సఖీ ! ఐశ్వర్యవంతుడను, బలవంతుడనగు నేను నీ హస్తమును గ్రహించుచున్నాను. ధర్మము ననుసరించి మన మిరువురము పత్నీపతులమగు చున్నాము."

3. ఓం మమేయమస్తు పోష్యా మహ్యంత్వాదాద్ బృహస్పతి:,
మయా పత్యా ప్రజావతి శం జీవ శరద: శతమ్ ।  (అథర్వ 14-1-52)

ఓ ప్రజావతీ ! సంతానార్థము పరమాత్మ నిన్ను నాకొసగెను. అట్టి నిన్ను నేను పోషింతును. పతినగు నాతో నూరు సంవత్సరములు సుఖముగ జీవింపుము."

4. ఓం త్వష్టా వాసో వ్యదధాచ్ఛుభే కం బృహస్పతే :
ప్రశిషా కవీనామ్, తేనేమాం నారీం సవితా భగశ్చ
సూర్యామివ పరిధత్తాం ప్రజయా ॥  (అథర్వ 14-1-53)

ఓ దేవీ ! నీవు నాకొరకు సుందర వస్త్ర ఆభరణాదులను ధరించి విద్యుల్లతవలె ప్రకాశించుచు నా వలన సుఖములను పొందుము. నిన్ను నేను వస్త్ర ఆభరణాదులతో శోభిల్లజేయుదును."

5. ఓం ఇంద్రాగ్నీ ద్యావాపృథివీ మాతరిశ్వా మిత్రా
వరుణా భగో అశ్వినోభా; బృహస్పతిర్ మరుతో
బ్రహ్మ సోమ ఇమాం నారీం ప్రజయా వర్ధయంతు ।
(అథర్వ 14-1-54)

" ఓ బంధువులారా! మీరెల్లరు ఈ నారీమణిని సంతానాదులతో వర్ధిల్లునట్లాశీర్వదింతురు గాక ! ఈమె అభివృద్ధికి తోడ్పడుదురు గాక ! నేను నా శక్తి కొలది ఈమె అభివృద్ధికి పాటుపడుదును."

6. ఓం అహం విష్యామి మయి రూపమస్యా వేదదిత్
పశ్యన్ మనస: కులాయమ్,.న స్తేయమద్మి మనసో
దముచ్యే స్వయం శ్రథ్నానో వరుణస్య పాశాన్ ।
(అథర్వ 14-1-57)

" ఓ కళ్యాణీ ! మనస్సుతో కులవృద్ధి నభిలషించుచు నేను నీ ఈ రూపమును ప్రేమతో పొంది సుఖింతును. అట్లే నీవు కూడ నాయందు ప్రేమతో వర్తింపుము. మనస్సుతో కూడ నీయెడ చౌర్యమాచరింపను. నీకు తెలియకుండ భుజింపను. దుర్వ్యసనములను దరిచేరనీయను."

వధువు కూడ లేచి సభ్యుల ఎదుట ఈ క్రింది విధముగా ప్రతిజ్ఞ

చేయును

"ఆర్యపుత్ర! సౌభాగ్యాభివృద్ధి నాశించి నేను నీ పాణిని గ్రహించుచున్నాను. పత్నినగు నాతో వార్ధక్యము వరకు ప్రసన్నతతో జీవింపుము. నేటినుండి నన్ను నీవు, నిన్ను నేను ద్వేషింపక ప్రేమతో వర్ధిల్లుదుము గాక ! గృహమునందలి సమస్త కార్యములు, ఉత్తమ సంతానము, ఐశ్వర్యము, సౌఖ్యము అభివృద్ధి నొందుచుండును గాక! హే భద్రపురుష ! పరమాత్మని కృపవలన నీవు నాకు లభించితివి. నీ హృదయము, ఆత్మ మనస్సులను ప్రియాచరణ మగునట్టి నీ కర్మలను నేను ధరించుచున్నాను. ఏకాగ్రచిత్తుడవై నీవు నా మాటలను వినుదువుగాక! నేటినుండి పరమాత్మ నిన్ను నాకొసంగెను. నూరు సంవత్సరములు నాతో సుఖింపుము." ఇట్లు ఇరువురు విద్వాంసుల ఎదుట ప్రతిజ్ఞ నొనర్చిన పిదప హెూమకుండము చుట్టూ ప్రదక్షిణ చేయుదురు.

శిలారోహణము

తదుపరి వరుడు వధువు కుడివైపునకు వచ్చి నిలబడవలయును. పెండ్లి కుమార్తె సోదరుడు వారిరువురిమధ్య వెనుకభాగమున కూర్చుండి తన సోదరి కుడిపాదమును సానరాయి మీదనుంచి ఆ పాదమును తన కుడిచేతితో తాకవలయును. అప్పుడు వరుడు

7. **ఓం ఆరోహేమ మశ్మాన మశ్మేవ త్వగ్ం స్థిరాభవ, అభితిష్ఠ పృతన్యతోऽవబాధస్వ పృతనాయతః ।**

(పారస్కర. గృహ్య. సూ. 1-7-1)

" ఓ వధూ ! నీవీ శిలపై పాదమునుంచి గృహస్థాశ్రమమున శిలవలె స్థిరముగా నుండుము. నీకు అపకారము తలపెట్టు దుర్మార్గులను వారి దుష్టభావముల నెదుర్కొని హృదయమును శిలవలె చేసుకొని విజయమును పొందుము."

స్త్రీ హృదయము నవనీతము - వెన్నకంటె మృదువుగను, వజ్రము కంటె కఠోరముగ నుండునని మహర్షిమనువు అభిప్రాయము. **'మాతృవత్ పరదారేషు పరద్రవ్యాణి లోష్ఠవత్'** పరస్త్రీలను తల్లివలె ఇతరుల వస్తువులను మట్టిబెడ్డలవలె చూడవలయునని నీతిశాస్త్రము చెప్పుచున్నది. కనుక స్త్రీలను అవమాన

మొనర్చుటకు యత్నించు దుష్ట శక్తులను ఎదిరించి పోరాడి విజయమును సాధించి తిరిగి నన్ను చేరుమని వరుడు వధువునకు బోధించును. సోదరుడు వివాహమైన తదుపరి కూడ నీవెదుర్కొను కష్టసుఖములలో నీకు తోడ్పడుచుందునని ప్రతిజ్ఞ చేయును.

## లాజ హోమము

వరి పేలాలను సంస్కృతములో 'లాజ' లందురు. వీనిని అగ్నిలో వేసి వధూవరులిరువురు హూమమొనర్తురు.

వరుడు మరల వధువు ఎడమభాగమునకు వచ్చి నిలబడవలయును.

వధువు తన దోసిలిని వరుని దోసిలిలో నుంచగా వధువు తల్లి వరి పేలాలున్న చేటను పట్టుకొని వారి వెనుక నిలబడి యుండును. వారి వెనుకనేనున్న వధువు సోదరుడు చేటలోని పేలాలను తన దోసిలినిండా తీసుకొని వారి దోసిలి నిండునట్లు పోయును. తదుపరి ఆ పేలాలపై కొద్దిగా నేతిని చిలకరింపవలయును. ఈ వేదమంత్రములన్నియు కేవలము వధువు మాత్రమే చెప్పవలయును.

1. **ఓం అర్యమణం దేవం కన్యా అగ్ని మయక్షత, స నో**
**అర్యమా దేవః ప్రేతో ముంచతు మా పతేః స్వాహా**
**ఇదమర్యమ్ణే అగ్నయ ఇదం న మమ.** (పా. గృ. 1-6-2)

కన్యలచే పూజింపబడు న్యాయకారియగు పరమేశ్వరుడు నన్ను పితృగృహము నుండి వేరుచేసి పతిగృహమునుండి వేరుచేయకుండును గాక!

2. **ఓం ఇయం నార్యుపబ్రూతే లాజా నావపంతికా,**
**ఆయుష్మానస్తు మే పతి రేధన్తాం జ్ఞాతయో మమ**
**స్వాహా - ఇద మగ్నయ ఇదం న మమ.** (పా. గృ. 1-6-2)

" పేలాలను అగ్నిలో హెూమము చేయు నేను నా భర్త చిరంజీవి యగునట్లు, నాజ్ఞాతులు (బంధువులు) వర్ధిల్లునట్లు భగవంతుని ప్రార్థించు చున్నాను."

3. **ఓం ఇమాన్ లాజా నావపామ్యగ్నౌ సమృద్ధికరణం తవ,**
**మమ తుభ్యం చ సంవననం తదగ్ని రనుమన్యతా**

మియగ్ం స్వాహా - ఇద మగ్నయ ఇదం న మమ

(పా. గృ. సూ. 1-6-2)

" ఈ పేలాలను అగ్నిలో హోమము చేయుచున్నాను. పరమేశ్వరుడు మన యిరువురిలో ప్రేమను వృద్ధినొందించును గాక !"

పై మూడు మంత్రములతో మూడుసార్లు పేలాలను అగ్నిలో ఆహుతి నివ్వవలయును.

తదుపరి వధూవరు లిరువురు యజ్ఞకుండము చుట్టూ నాలుగు పర్యాయములు ప్రదక్షిణ చేయవలయును. వీనికి 'మంగళ ప్రదక్షిణ' లని పేరు.

4. ఓం భగాయస్వాహా - ఇదం భగాయ ఇదం న మమ ।
వధువు పేలాలతో ఆహుతి నిచ్చును.

5. ఓం ప్రజాపతయే స్వాహా - ఇదం ప్రజాపతయ ఇదం న మమ ।
వరుడు నేతితో ఆహుతి నిచ్చును.

లాజాహోమమునకు తరువాత వధువు ముందుండి వరుడు ఆమె వెనుకనుండి నాలుగుసార్లు ప్రదక్షిణలు చేయుదురు. వివాహ సమయమున వరిపేలాలతో హోమము చేయుటకు గల కారణము అగ్నిలో వేసిన ధాన్యము పువ్వువలెవికసించి పేలాలుగ మారును. అదే విధముగా అగ్నిలో పేలాలు వేయు ఈ నూతన వధూవరుల ప్రేమానురాగములు ఒకరికొకరు పంచుకొనునపుడు వారి దాంపత్య జీవితము పేలాలవలె వికసించునను అభిప్రాయసూచకముగా వానినగ్నిలో ఆహుతినిత్తురు. వివాహ సంస్కారము నడుమ వరిధాన్యమును తెచ్చుటలో గల మరొక అభిప్రాయము : వరిధాన్యము మొదట ఒకచోట వేసి విత్తనములు వరి మొక్కలుగ (నారుమడులుగ) కొంతకాలము పెరిగిన తరువాత అచ్చటినుండి తీసి మరొకచోట నాటుదురు. అచ్చట ఆ మొక్క పుష్పించి ఫలించి ధాన్యముగ మారును. కన్య విషయములో కూడ అదే జరుగును.

ప్రదక్షిణ చేయుటకు కారణము: వధూవరు లిరువురు ప్రదక్షిణ చేయుట వలన వివాహ మండపమునకు నలువైపులా కూర్చొన్న ప్రజలకు బాగుగా

కనబడుదురు. వివాహము జీవితాంతము వరకు నుండు సంబంధము. అప్పుడప్పుడు వారిమధ్య కలహములేర్పడుట కవకాశమున్నది. సాక్షులు కూడ అవసరమగుచుందురు. ఈ రోజులలో జరుగు Registered Marriage లలో కూడ సాక్షుల అవసరముండును. వైదికముగ జరుగు వివాహములలో కాగితముపై రిజిస్టరు చేసుకొను పద్ధతిగాక నాలుగుసార్లు (మొత్తం 7 సార్లు) వధూవరులు తమ ముఖములను తమ బంధుమిత్ర వర్గమునకు చూపి తాము స్వచ్ఛంధముగ వివాహము చేసుకొనుచున్నట్లుగ వారు తమను గుర్తించునట్లుగ చేయుదురు. నాలుగు సార్లు ప్రదక్షిణ చేయుటవలన ప్రజలు వారిరువురను బాగుగా చూచుట కవకాశముండును. ఈ మంగళ ప్రదక్షిణలు కాగానే చట్టము ననుసరించి వివాహము జరిగినట్లు పరిగణింతురు.

## కేశ విమోచనము

తదుపరి వరుడు వధువును ఏకాంత ప్రదేశమునకు తీసుకెళ్ళి ఈ క్రింది మంత్రములను చదువు వధువు కేశములను అలంకరింపవలయును.

1. **ఓం ప్రత్వాముంచామి వరుణస్య పాశాద్యేన త్వా**
**బధ్నాత్ సవితా సుశేవః, ఋతస్య యోనౌ సుకృతస్య**
**లోకేzరిష్టాం త్వా సహ పత్యా దధామి.**
2. **ఓం ప్రేతో ముంచామి నాముత : సుబద్ధామము తస్కరమ్,**
**యథేయమింద్ర మీఢ్వః సుపుత్రా సుభగాసతి. (10-85-24,25)**

## సప్తపది

వధూవరు లిరువురు హోమ వేదికపై ఉత్తరాభిముఖులై నిలబడవలయును. పురోహితుడు యిరువురి ఉపవస్త్రములను ముడివేయవలయును. దీనినే గ్రన్థి బంధన ( బ్రహ్మముడి) మందురు. తదుపరి వరుడు తన కుడి చేతిని వధువు కుడిభుజముపై నుంచి -

**మా సవ్యేన దక్షిణ మతిక్రామ.** (గో. గృ. సూ. 2-2-12)

" ఓ వధూ ! నీ ఎడమ పాదమును కుడిపాదమునకంటె ముందుకు పోనీయకుము" అనును.

1. ఓం ఇష ఏకపదీ భవ సా మా మనువ్రతా భవ,
విష్ణుస్త్వానయతు పుత్రాన్ విందావహై బహూం
స్తే సంతు జరదష్టయః.
(ఆశ్వ. గృ. సూ. 1-7-19; పార. గృ.సూ. 1-8-1,2
(అన్న సంపాదన కొరకు మొదటి పాదమును వేయుదురు)
2. ఓం ఊర్జే ద్విపదీ భవ సా మా మనువ్రతా భవ,
విష్ణుస్త్వానయతు పుత్రాన్ విందావహై బహూంస్తే సంతు జరదష్టయ ః.
(బలము కొరకు రెండవ పాదమును వేయుదురు)
3. ఓం రాయస్పోషాయ త్రిపదీ భవ, సా మా మనువ్రతాభవ,
విష్ణుస్త్వానయతు పుత్రాన్ విందావహై బహూంస్తే సంతు జరదష్టయః.
(ధన సంపాదన కొరకు మూడవ పాదమును వేయుదురు)
4. ఓం మయోభవాయ చతుష్పదీ భవ సా మా మనువ్రతా భవ,
విష్ణుస్త్వానయతు పుత్రాన్ విందావహై బహూంస్తే సంతు జరదష్టయః.
(సుఖము కొరకు నాల్గవ పాదమును వేయుదురు)
5. ఓం ప్రజాభ్యః పంచపదీ భవ సా మా మనువ్రతా భవ,
విష్ణుస్త్వానయతు పుత్రాన్ విందావహై బహూంస్తే సంతు జరదష్టయః.
(సుసంతానము కొరకు ఐదవ పాదమును వేయుదురు)
6. ఓం ఋతుభ్యః షట్పదీ భవ సా మా మనువ్రతా భవ,
విష్ణుస్త్వానయతు పుత్రాన్ విందావహై బహూం స్తే సంతు జరదష్టయః.
(ఋతువుల అనుకూలత కొరకు ఆరవ పాదమును వేయుదురు)
7. ఓం సఖే సప్తపదీ భవ సా మా మనువ్రతా భవ,
విష్ణుస్త్వానయతు పుత్రాన్ విందావహై బహూంస్తే సంతు జరదష్టయః.
(మైత్రి కొరకు ఏడవ పాదమును వేయుదురు)

ఇట్లు ఇరువురు కలిసి ఏడడుగులు ఈశాన్యదిశగా నడచి గ్రంధి బంధనముతో పాటు హోమకుండము చుట్టూ ఒకసారి ప్రదక్షిణ చేయవలయును.

వివాహ సంస్కారములో ఈ సప్తపది క్రియ అతి ముఖ్యమైనది. దీనిలో

ఇరువురు కలసి 'అన్నము' కొరకు మొదటి అడుగు వేయుదురు. అప్పుడు వరుడు వధువుతో నీ మనస్సు నా మనస్సునకు అనుకూలముగ నుండునుగాక! పరమాత్మ నిన్ను నా కనుకూలముగ చేయునుగాక! మన మిరువురము కలిసి మంచి సంతానమును పొందుదుము. వారు వృద్ధాప్యము వరకు జీవించి యుందురుగాక! అని పరమేశ్వరుని ప్రార్థించును.

ఇచ్చట శుద్ధసాత్త్వికాహారమును 'అన్న'మని చెప్పబడినది. **'అద్యతే అత్తి చ తదన్నమ్'** (తైత్తిరీయోపనిషత్తు - బ్రహ్మానందవల్లి - ద్వితీయానువాకము) ప్రాణులకు అన్నమువలననే శరీరము లేర్పడుచున్నవి. అన్నము వలననే పోషింపబడుచున్నవి. తుదకు మరణించినపుడు ఈ శరీరములు మరల పృథివిలోనే కలసిపోవుచున్నవి అని పై వాక్య భావము. ఆహారము రెండు రకములుగా లభించుచున్నది. 1. శాఖాహారము 2. మాంసాహారము. మానవ శరీరమునందలి అవయవ నిర్మాణమును పరీక్షించినచో మానవులు శాఖాహారులని తెలియుచున్నది. కొన్ని క్రూర మృగములకు మాత్రమే మాంసము ఆహారము. ఆహారమును భుజించుట వలన 1. సత్త్వగుణము 2. రజోగుణము 3. తమోగుణములుగల శరీరములు తయారగును. శాఖాహారము వలన సత్త్వగుణ మధికమగును. మాంసాహారము వలన తమోగుణ మధికమగును. మానవులు పురుషార్థ పరులు కావలయునని వైదిక సాహిత్య మంతట ఉపదేశింపబడుచున్నది. అనగా ధర్మార్థ కామమోక్షములను సాధింపవలయును. ధర్మము నాచరించుటకు అహింసా వ్రతమును పాలించుట అనివార్యము. **'ధర్మోహి తేషామధికో విశేషో, ధర్మేణ హీనాః పశుభిః సమానాః'** మానవులకు జంతువులకు గల తేడా ఒక్క ధర్మాచరణయే. ధార్మికుడు కాని మానవుడు పశువుతో సమానుడే యని నీతి శాస్త్రకారులు చెప్పుచున్నారు. **'నా కృత్వా ప్రాణినాం హింసా, మాంసముత్పద్యతే క్వచిత్** (మనువు 5 -48). ప్రాణులను హింసింపకుండా - చంపకుండా మాంసము దొరకదు. కనుక మాంసమును భుజించుట హింసకు కారణమై అహింసవలన మానవులు పాపఫలము ననుభవింపవలసి వచ్చునని శాస్త్రములు చెప్పుచున్నవి. శాఖాహారమును భుజించుటవలన సత్త్వగుణము పెరుగుటతో పాటు ఆరోగ్యవంతులగుదురు.

మాంసాహారమును భుజించుట వలన తమో గుణము పెరుగుటతోపాటు బుద్ధిమాంద్యము అధికమై రోగ గ్రస్థులగుదురు.

నేడు పాశ్చాత్యదేశములలో కూడా మాంసాహారమును క్రమముగా తగ్గించి శాఖాహారులగుచున్నారు. ఆంగ్ల పత్రిక ALIVE 1990 జనవరి సంచికలో Popularity of Vegetarianism అను శీర్షికన అమెరికాలో ప్రజలు మాంసాహారమును భుజించుట ఎక్కువగుట వలన మాంసకృత్తులు అధికమై అనేక దీర్ఘవ్యాధులకు లోనగుచున్నట్లు, వాని నివారణ కొరకు వ్యాయామాదులు చేయుచున్నట్లు తెలుపబడినది. మాంసాహారమును సేవించువారిలో కేన్సర్, గుండెజబ్బులు, రక్తపోటు (Blood Pressure) ల వంటి భయానక వ్యాధులు అధికముగ వచ్చుచున్నట్లు, శాఖాహారులలో యివి తక్కువగవచ్చుచున్నట్లు పరిశోధనలో కనుగొనిరి. **'యథా అన్నం తథామనః'** ఎటువంటి ఆహారమును తీసుకొంటే అటువంటి మనస్సు ఏర్పడునని ఆయుర్వేద శాస్త్రం చెప్పుచున్నది. కనుక నేటి ప్రపంచ మానవులలో తన తోటివారి యెడల ప్రేమ, దయ, జాలి, అనుకంప మున్నగు గుణములు లోపించుటకు, తద్వారా శాంతి కరువగుటకు పరోక్షముగ ఈ మాంసాహారము కూడా ఒక కారణమనవచ్చును. వైదిక కాలమునాటి మానవుని కనీస జీవన అవధి నూరు సంవత్సరములుగ **'జీవేమ శరదః శతమ్'** (యజు 36-24) అను నిట్టి అనేక వేదమంత్రముల ద్వారా విదితమగుచున్నది.

వధూవరులు రెండవ పాదమును వేయుచు 'ఊర్జము' అనగా శారీరిక బలమును కోరుదురు. ఆహారము వలన బలము లభించునని మనకు తెలియును. బలముగల మానవుడు మంచి పనులు చేయగలడు. లేక చెడు కార్యములను కూడా చేయవచ్చును. మంచి పనులు చేయుటవలన తనకు లాభము చేకూరుటే గాక సమాజ కల్యాణము కూడా జరుగును. చెడు పనుల వలన సంఘమునకు హాని కలుగును. తాత్కాలికముగ తనకు లాభము చేకూరినను కాలాంతరమున తీరని నష్టము కలుగును. కనుక సంఘజీవియైన మానవుడు సదాచారవర్తనుడు కావలయును. బలవంతుడై మంచిపనులలో మాత్రమే తన శక్తియుక్తుల నుపయోగించుచు సత్కర్మలనే ఆచరించుచు

సమాజ సేవాకార్యక్రమములలో పాల్గొనికీర్తినార్జింపవలయును. 'కీర్తిర్యస్య సజీవతి' కీర్తినార్జించిన మానవుడు చనిపోయినను జీవించియున్న వానితో సమానమని శాస్త్రోక్తి. తన ఉన్నతితో పాటు అందరి ఉన్నతికి తోడ్పడు శక్తిని తమకు ప్రసాదింపుమని రెండవ పాదమును వేయుచు పరమేశ్వరుని వారు ప్రార్థింతురు.

మూడవ పాదము ముందుకు వేయుచు - 'రయస్' అనగా ధనమును కోరుదురు. చక్కని పుష్టికరమైన శుద్ధ సాత్త్విక ఆహారమును సేవించుట వలన లభించిన శక్తితో చక్కగా శ్రమించి కష్టపడి న్యాయముతో ధనము నార్జించవలయును. ఇతరులను మోసగించి అన్యాయముగ ఆర్జించిన ధనము అక్కరకు రాక దురుపయోగము చేయబడి, తన నార్జించినవానికే హాని కలుగజేయట కాధనము సాధనముగ ఉపయోగపడును. అన్యాయార్జన చేత మానవుడు దురాచారియై పతితుడై దుర్వ్యసనములలో చిక్కుకొని తాను నష్టపడుచు తన కుటుంబముతోపాటు యితరులను కూడా నష్టపరచును. కనుక శాస్త్రములు '**పరద్రవ్యాని లోష్ఠవత్**' యితరుల ధనమును మట్టిబెడ్డలవలె తలంచి ముట్టరాదని చెప్పుచున్నవి .'**మాగృధః కస్య స్విత్ ధనమ్**' ఎవరి సొమ్మును అపహరింపరాదు. అని వేదోపదేశము.

నాల్గవ పాదమును వేయుచు - 'మయోభవాయ' - సుఖముల కొరకు పరమేశ్వరుని ప్రార్థింతురు. పైన చెప్పినట్లుగ సాత్త్వికాహార సేవనముతో పొందిన బలముతో కష్టించి ధనము నార్జించి ఆ ధనముతో తన కుటుంబము తాను సుఖముగ జీవించుటకై వధూవరులు ఈ అడుగువేయుచు పరమేశ్వరుని ప్రార్థింతురు.

ఐదవ పాదమును వేయుచు 'ప్రజాభ్యః' - మంచి సంతానమును కోరుదురు. తమకు జన్మించిన సంతానము అన్యాయకారులు, దురాచారులు, లంచగొండులు, దొంగలు, వ్యభిచారులు, సంఘమును పట్టిపీడించువారు కాకుండ: ధార్మికులు, సదాచారపరాయణులు, త్యాగశీలురై కుటుంబమునకు, సంఘమునకు, దేశమునకు, ప్రపంచమునకుపయోగపడవలయునని కోరుదురు. తమ వంశమునకు కీర్తి ప్రతిష్ఠల నార్జించునట్టి సంతానము కావలయునని వారిరువురు భగవంతుని ప్రార్థింతురు.

ఆఱవ పాదమును 'ఋతుభ్యః': సకాలములో ఋతువు లేర్పడుటకై వేయుదురు. వసంతాది శిశిరపర్యంతము ఆరు ఋతువులు వాతావరణ సంతులనము పై ఆధారపడి ఏర్పడుచుండును. వాతావరణము సమతూకముగ నున్నపుడు ఋతువులు సకాలమున నేర్పడి ఆయా ఋతువులలో ఫలపుష్పాదులు సహజముగ పుష్పించి ఫలించును. శీతోష్ణములు, వర్షపాతము సమముగ నుండును. వాతారణ సంతులన చెడి ఋతువులు సరిగా ఏర్పడనిచో అతివృష్టి, అకాల వృష్టులతో క్షామమేర్పడి కరువు కాటకము లేర్పడును. కనుక అట్టి వాతావరణ సంతులనమును కాపాడుటకు నిత్యము మానవుడాచరింపవలసిన పంచ మహాయజ్ఞములలో దేవయజ్ఞము ( అగ్ని హెూత్రము) అతి ముఖ్యమైనది. మానవులు నిత్యమాచరించు దేవయజ్ఞము ద్వారా క్రమముగ వాతావరణమున మార్పులు కలుగుచు సకాలమున ఋతువు లేర్పడి వర్షించి పంటలు, ఫలపుష్పాదులు అధికముగ పుష్టికరములుగ లభించును. కనుక గృహస్థాశ్రమమున ప్రవేశించు నూతన వధూవరులిరువురు దేశకల్యాణము నాకాంక్షించి సక్రమ ఋతువుల కొరకు తమ వంతు కర్తవ్యమును నెరవేర్చెదమని భగవంతుని ప్రార్థించుచు ఆరవపాదమును ముందుకు వేయుదురు.

ఏడవ పాదమును వేయుచు 'సఖే' - పరస్పర స్నేహమును కోరును. తాము నూతనముగ ప్రవేశించుచున్న గృహస్థాశ్రమమును స్వర్గతుల్యముగ చేసుకొనుటకై వరుడు తన పత్ని స్నేహసహకారములనపేక్షించును. దంపతు లిరువురు కలసి మైత్రీభావముతో జీవనము సాగించినపుడే ఆ కుటుంబము సుఖసంతోషములతో వెల్లివిరియును. అభ్యున్నతిని సాధించును. భార్యాభర్తలు కలహించుకొను పరివారమునందలి సంతానము పూర్ణవృద్ధి నొందజాలదు. ఇరువురి భావము లొకటిగనుండి గృహస్థాశ్రమములో ఎదురగు కష్టసుఖములను ధైర్యముతో అనుభవించినపుడే వారు శాంతిమయ జీవనమును గడుప గలుగుదురు. లేని ఎడల అదొక నరకకూపముగ మారును. ఇట్లు ఏడడుగులు కలసి నడచిన నూతన వధూవరులు యిరువురు హెూమకుండము చుట్టూ ప్రదక్షిణ చేయుదురు. వధువు ముందుండవలయును. వరుడామెను

అనుసరించును.

తదుపరి పురోహితుడు వధూవరులపై స్నాన మంత్రములతో జలమును చల్లవలయును.

తదుపరి నూతన వధూవరులు సూర్యుని దర్శించి భగవంతునిట్లు ప్రార్థింతురు. హే ప్రకాశ స్వరూప పరమేశ్వర ! జ్ఞానదాత ! మేము నీ కృపవలన నూఱు సంవత్సరములు చక్కగా దర్శనశక్తి గలిగి యుందుము గాక! నూరు సంవత్సరములు సుఖముగ జీవింతుముగాక! నూరు సంవత్సరములు చక్కగా విందుము గాక! నూరు సంవత్సరములు చక్కగా మృదువుగా మధురముగా ఇతరులతో మాట్లాడుశక్తిని గలిగియుందుముగాక! నూరు సంవత్సరములు స్వతంత్రముగ ఏ దుఃఖములు లేక జీవించుచుందుము గాక! అని ప్రార్థింతురు.

తదుపరి ఒకరి హృదయము నొకరు స్పృశించుచు - 'నేను నా మనస్సును ఆత్మను నీవు చేయ శుభకర్మల కనుకూలముగ నుంచెదను. నా చిత్తమున కనుకూలముగ ( నా ఆలోచనల కనుకూలముగ) నీ చిత్తముండును గాక! నా మాటలను ఏకాగ్రచిత్తముతో విందువు గాక! పరమేశ్వరుడు నిన్ను నా కొరకు నియోగించునుగాక! అని సంకల్పింతురు.

**సుమంగళీశంసనము - ఆశీర్వాదము**

దక్షిణ భారతదేశపు ఆచారము ననుసరించి వధువు మెడలో వరుడు మంగళసూత్రమును ఈ క్రింది శ్లోకమును చదువుచు ధరింపచేయును.

శ్లో॥ మాంగల్య తంతునానేన మమ జీవన హేతునా, కంఠే
బధ్నామి సుభగే త్వం జీవ శరదాంశతమ్॥

మంగళసూత్రమును కట్టుటకు ముందు జీలకర్ర బెల్లములను కలిపి వధూవరుల శిరస్సులపై నుంచుట కూడ దక్షిణదేశపుటాచారము. కనుక ఇష్టమున్నవారు చేసుకొనవచ్చును. కాని వీనికి, పైన చెప్పిన గృహ్యసూత్రాదులలో ఎటువంటి ప్రమాణము లేనందున అవైదికము. కావున చేయకుండుటే మంచిది.

తదుపరి వరుడు లేచి నిలబడి వధువు మస్తకము పై తన కుడి అరచేతినుంచి సభ్యులనుద్దేశించి ఈ క్రింది మంత్రము ఉచ్ఛరించి తన

పత్నినాశీర్వదింపుడని కోరి కూర్చుండవలయును.

**ఓం సుమంగలీరియం వధూః ఇమాం సమేత పశ్యత ।**

**సౌభాగ్య మస్యై దత్త్వా యాథాస్తం విపరేతన ॥**

(ఋ. 10-85-33)

వివాహ మండపములో గల సభ్యులందరూ వరుసగా వివాహ వేదిక వద్దకు వచ్చి అక్షతలనుగాని పుష్పములనుగాని తీసుకొని వధూవరుల శిరస్సులపై నుంచుచు ఈక్రింది మాటలతో ఆశీర్వదించవలయును.

**ఓం సౌభాగ్యమస్తు** - అని వధువు నాశీర్వదించవలయును.

**ఓం శుభం భవతు** - అన వరుని ఆశీర్వదించవలయును.

తదుపరి వధూవరులు యజ్ఞకార్యమును ముగింపవలయును.

**ఉత్తర విధి**

వైదిక వివాహ సంస్కారములో జరుపబడు విధిలో చివరిది ధృవనక్షత్ర దర్శనము మరియు అరుంధతీ నక్షత్ర దర్శనములు. పురోహితుడు వధూవరులను బయటికి తీసుకొని వచ్చి ఉత్తరదిశలో నిలిపి వరునకు ఆకాశమునందు గల ధృవనక్షత్రమును చూపి - వ్రతపాలనతో నీవీ ధ్రువ నక్షత్రమువలె స్థిరముగా నుండవలయునని బోధించును. అట్లే వధువునకు అరుంధతీ నక్షత్రమును చూపుచు - అరుంధతీ నక్షత్ర మెల్లప్పుడు ఆకాశములో వశిష్ఠ నక్షత్రముతో కలిసియుండునట్లు నీవును నీపతితో కలిసి పతిగృహమున పరివారముతో కలిసి స్థిరముగ నుండుమని బోధించును.

తరువాత వరుని ప్రతియాత్ర - తన గృహమునకు వధువుతో, తరలి వెళ్ళుట. తన గృహమున వధువుతో యజ్ఞమును నిర్వహించి యిరువురు తల్లి దండ్రులకు పెద్దలకు అభివాదము చేయుట. వారందరు స్వస్తి స్వస్తి స్వస్తి అని ముమ్మారు స్వస్తి వచనములతో నూతన వధూవరుల నాశీర్వదించుటతో వివాహ సంస్కారవిధి పరిసమాప్తమగును.

# మా గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

12-10-586/6, వ్యాస్ నగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061

| పుస్తకము పేరు | రచయిత | వెల |
|---|---|---|
| 1. గోమాత | (డా॥ కోడూరి సుబ్బారావు) | 7.00 |
| 2. వైదిక వైజ్ఞానిక సంస్కృతి | " | 10.00 |
| 3. వేదాలలో జలచికిత్సా విజ్ఞానం | " | 20.00 |
| 4. మానవ ధర్మము | " | 10.00 |
| 5. గాయత్రీ మహిమ | " | 6.00 |
| 6. వైదిక క్రాంతి పథం | " | 15.00 |
| 7. చతుర్దశ భువనములు | " | 3.00 |
| 8. అగ్ని హోత్ర వైజ్ఞానిక స్వరూపము | " | 15.00 |
| 9. యజ్ఞోపవీత వైశిష్ట్యము | " | 2.00 |
| 10. జననీ - జన్మభూమి | " | 5.00 |
| 11. దౌహృదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ) | " | 15.00 |
| 12. లక్ష్మీసూక్తము | " | 1.00 |
| 13. యుగపురుషుడు శ్రీకృష్ణుడు | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 8.00 |
| 14. పురుషోత్తముడు శ్రీరాముడు | " | 14.00 |
| 15. మహర్షి మనువుపై విరోధమెందుకు? | " | 3.00 |
| 16. వేదములలో విజ్ఞాన బీజాలు | " | 10.00 |
| 17. ధర్మవీర్ పం. లేఖరాం | " | 3.00 |
| 18. ప్రణవ స్తోత్రమ్ | " (చిన్నవి 2.50) | 5.00 |
| 19. శ్రీమతి లక్ష్మీదేవి ప్రేరణాత్మక జీవనం | " | ఉచితము |
| 20. వైదిక వివాహ వైశిష్ట్యము | (సంధ్యావందనం లక్ష్మీదేవి) | 8.00 |
| 21. అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ | (లోక మల్లరి) | 20.00 |
| 22. మాతా పుత్రికల జ్ఞాన చర్చ | " | 15.00 |
| 23. చాణక్యనీతి | (పం. వెంకయార్య) | 40.00 |
| 24. శ్రీ దయానంద హృదయము | (జాస్తి నరసింహరావు) | 12.00 |
| 25. వైదిక అగ్ని హోత్ర విధి | | 4.00 |
| 26. ది గ్రేట్ గాయత్రి | | 2.00 |
| 27. శాంతి ప్రార్థన | | 0.75 |
| 28. బ్రహ్మచర్య విజ్ఞానము | (టి. సూర్యనారాయణ) | 15.00 |
| 29. వైదిక అర్థనీతి | " | 2.00 |
| 30. దయానందుని ఆదర్శ రాజ్యము | " | 1.00 |
| 31. వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి | " | 1.50 |

GAYATRI SERIES - 15

**VEDIC VIVAHA VAISHISHTYAMU** **Rs. 8-00**



ధ్రువాసి ధ్రువే z యం యజమానేz స్మి
న్నాయతనే ప్రజయా పశుభిర్భూయాత్ ।
ఘృతేన ద్యావా పృథివీ పూర్యేథా మిన్ద్రస్య
ఛదిరసి విశ్వజనస్య ఛాయా ॥ (యజు. 5 - 28)

ఓ యజ్ఞమొనర్చు వధూవరులారా! మీ రిరువురు ఈ గృహస్థాశ్రమమున పంచ మహాయజ్ఞాది కర్తవ్య కర్మ లాచరించుచు స్థిరముగా నుండుడు. విశేష యజ్ఞాదులొనర్చి ద్యావా పృథివీలోకములను ఘృతాది సుగంధ పదార్థములతో పరిపూర్ణ మొనర్చుడు. సుసంతానముతో, గవాశ్వాది పశు సంపదలతో వర్ధిల్లుడు. పురుషార్థముతో ఐశ్వర్యవంతులై విశ్వజనులకు సుఖ ఛాయల నిండు.